# గీతాహృదయము



డాక్టరు శంకర శ్రీరామారావు
రామచంద్రరావుపేట
ఏలూరు.

# తొలి పలుకు

శ్రీమద్భగవద్గీత భారతీ యేతిహాసము నందలి యొకానొక క్లిష్టసమయమ్మునఁ గృష్ణభగవానుని రసనాగ్రమునుండి వెలువడిన జ్ఞానధార. అది నరునకు నారాయణుఁ డొసంగిన దివ్యసందేశము. సంశయగ్రంథులను గరగింపఁజాలు నమృతరసాయనము. అర్జున హృదయకుహరమ్ము నావరించిన యజ్ఞానాంధకారమును బాప నుదయించిన జ్ఞానభాస్కర తేజోరాశి. ఈ గీతగానముచేఁ బార్థుని హృదయమునఁ గరుడు కట్టిన విషాదము కరిగి, నీరై, నిష్కామ కర్మరూపమునఁ బ్రవహించినది. అర్జునుఁడు వీరాధి వీరుఁడు. ఉత్తమక్షత్రియ వంశసంభూతుఁడు. సహృదయుఁడు. కాని నరమాత్రుఁడు కావుననే మానవ సహజమ్మగు దౌర్బల్యమునకు లోనై కర్తవ్యమును నిర్ణయింపఁజాలక, ధర్మసందేహమును దీర్పుమని కృష్ణ పరమాత్మను వేడుకొనినాఁడు. ధర్మక్షేత్రమగు కురుక్షేత్ర యుద్ధరంగమ్మున కురుపాండవ సైన్య మధ్యభాగమ్మునుండి, యుభయపక్షము లందలి బంధుమిత్రుల విలోకించి నంతనే యాతని హృదయమున నొక సంశయాంకురము పొడమినది. చూచుచున్నంతలో నది పెరిగి విశ్వరూపము దాల్చినది. ప్రళయ ఝంఝూనిలము వీవ మొదలిడినది. దాని తీవ్రతచే నిరస్తతేజుఁడై మూర్తి దాల్చిన కర్తవ్యతామౌఢ్య మట్లు తేరుపైఁ జతికిలఁబడినాఁడు. "ఇఁక

సామ్రాజ్య వాంఛాపిశాచమునకుఁ బ్రాణతుల్యులగు వీరి నెల్లర బలి యొసంగ వలసిన దేనా!" అను నదియే ధర్మసందేహము. తనకుఁ జెలియై చుట్టమై సచివుండై యనేక ప్రమాదములనుండి తప్పించిన కృష్ణుని ధర్మనిర్ణయముఁ జేయుమని ప్రార్థించినాడు.

భక్తపరాధీనుఁడగు మాధవుఁడు శిష్యునిదురవస్థం గాంచి జాలిపడినాడు. పార్థసారథిగావునఁ గర్మసారథ్యమునకుఁ గడంగి, గీతాగానము నుపక్రమించినాడు. శ్రమఁజెందిన పార్థహృదయరంజకత్వము కొరకుఁగాఁ బోలు గానకళాసాధనమును జేఁబట్టినాడు. తద్ద్వారమున బ్రహ్మవిద్యామృత ధారలను చిలికి, శిష్యుని జ్ఞానపిపాసఁ దీర్చినాడు.

తొలుదొల్త, విషాదధ్వాంతమున మరుగువడియున్న క్షత్రియధర్మమును స్మరణకుఁ దెచ్చినాడు. పిదప, సాంఖ్య సిద్ధాంతముచే దేహ మనిత్య మనియు, నాత్మ నిత్యమనియు నిరూపించినాడు. సర్వవ్యాప్తమగు నాత్మకు స్వపరభేదము లేదనియుఁ జెప్పి "నా", "నీ" యను భేదములను విడువుమని బోధించుచున్నాడు.

తరువాత, కర్మయోగ సారము నుపన్యసించుచు గీతయొక్క మూలసిద్ధాంతమును గరతలామలక మొనర్చుటకుఁ గాను, వివిధరీతులఁ గర్మఫలత్యాగమును బోధించుచున్నాడు. స్వధర్మనిర్వహణమే మోక్షసాధక

మనియు, కర్మఫలత్యాగమే ఉత్తమోత్తమమగు సన్న్యాసమనియు, లోకసేవాధర్మమే యజ్ఞమనియు, కట్టు, బొట్టు, జుట్టు, మొదలగు బాహ్యాడంబరములు నిరర్థకములనియుఁ జెప్పి, ఆత్మశుద్ధికై ప్రయత్నింపుమని బోధించుచున్నాడు.

సాధకునకు ఆత్మసంయమముయొక్క యావశ్యకత నిరూపించుచు, మోక్షమందిరమునకుఁ దాళపుఁజెవి మనమున వ్రేలఁగట్టఁబడి యున్నదనియు, సాత్త్వికాహారాది నియమములచేతను, ఏకాంతభక్తిచేతను, నిశ్చలధ్యానయోగముననను, దానిని స్వాధీనముఁ జేసికొనవచ్చుననియుఁ జెప్పుచున్నాడు.

తరువాత, మానవహృదయ మందలి దైవాసుర ప్రవృత్తులయొక్క నిరంతరసంఘర్షణను గుఱించి చెప్పుచు, దేవతాప్రవృత్తులే జయించిన నతఁడు దేవతామూర్తియై విరాజిల్లుననియు, అసుర ప్రవృత్తులే గెలిచిన రాక్షసాకృతిఁ దాల్చి సుయోధనునివలె లోకకంటకుఁడగుననియుఁ దెలుపుచున్నాడు.

ఈ మెట్లన్నింటిని దాటించిన పిదప నర్జునునకుఁ దనయందుఁ గల గాఢవిశ్వాసమును మఱింత దృఢమొనర్చుటకుఁ గాను, ఆదిమధ్యాంతరహితమ్మును, సనాతనమును, సర్వభూతాత్మకమును, అక్షరమును నగు తన స్వరూప తత్త్వమును గతానుగతికముగఁ దెలియఁజెప్పుచున్నాడు.

అమృతోపమానమగు నీదివ్యగానము నాలించిన యర్జునునకు రసనసిద్ధియు; జ్ఞానసిద్ధియు నేకకాలమున లభించినవి. కృష్ణపరమాత్మచే వర్ణింపఁబడిన యా విశ్వరూపమునుగాంచఁ గుతూహలము వొడమినది. తద్దర్శన భాగ్యము లభింపఁజేయుమని ప్రార్థించినాఁడు. జ్ఞానబోధచేఁ బరిపక్వ హృదయుఁడైన భక్తునకు దర్శనభాగ్యమొసంగు తరుణ మాసన్నమైనది, ఇఁక నాలసింపఁ బనిలేదు. తన దివ్యరూపమును భక్తుని కనులముందు ప్రదర్శించినాఁడు. ఇఁక గావలసిన దేమున్నది? విశ్వరూప సందర్శనమైన వెనుక సంశయగ్రంథులకు దీర్ఘ సూత్రములకుఁ దావెక్కడ? హృదయమథన మైనది. అమృత కలశము చేఁజిక్కినది. అర్జునుఁడు కృతనిశ్చయుఁడై స్వధర్మ నిర్వహణకై కార్యరంగమున దూకినాఁడు. ఆత్మ విజయునకు విజయమేకదా ఫలము!

నే నీ చిన్న పొత్తము రచింపఁబూనుట కేవలాత్మానుభూతికిఁగాని, పాండిత్యప్రకర్షకుఁ గాదు. నేఁజేయునది క్షణమైనను దీరికలేని వైద్యవృత్తి. రోగభూతముల ప్రళయాట్టహాసముల నడుమఁ గవితాప్రణయము!

వైద్యరమతోడ బాల్యవివాహ మయ్యెఁ
దొలుత; నామీఁద ననుఁగోరి వలచెఁ గవిత;
సవతిపోరయ్యె మానస సదన మందు,
శాంతినెలకొల్పఁ గదవమ్మ! శారదమ్మ!

జీవనాధారమైన విశిష్టవృత్తి
వీడుటాత్మధర్మమ్మును వీడుటగును,
ప్రాణసమమైన కవితాప్రవృత్తి విడువఁ
గష్టమాత్రమె మిగులు శుష్కముగ జగతి.

ఈ రెంటికిని సమన్వయము ఆత్మజిజ్ఞాస. శ్లోలుదొల్త గీతాపఠనమునకు నన్నుఁ బురిగొల్పినది మహాత్ముని "Young India" వ్యాసములందలి మధురగీతానాదము. మహాత్ముఁడు మహాత్ముఁడగుటకు గీతావ్యాసంగమే కారణమేమో? అది మొదలు క్లిష్టసమస్యలనెదుర్కొను నప్పుడెల్ల గీతాసాహాయ్యమును బొందుచుంటిని. జీవితనిఘంటువైన గీత, ఆనాటి నరునకేగాదు; సర్వకాలములందును, సర్వమానవులకును, సర్వసంశయవిచ్ఛేదకమని నానిశ్చితాభిప్రాయము. వైద్యవృత్తియందలి నాయనుభవములను గీతాహృదయమున నానఁబెట్టి, కవితాముఖమున వెలువరించి, ఈ త్రిపథసమన్వయమున నానందించుటే, నా యీగ్రంథ రచనకుఁ బ్రధాన లక్ష్యము.

భుక్తికి భూలోకమ్మున,
రక్తికి రసలోకమందు, రమ్యతరంబౌ
ముక్తికిఁ బరలోకమ్మున,
భక్తిం జరియించుచుందు భాసురలీలన్.

ఈ గీతాదుగ్ధవారాశినుండి నా హృదయమునఁ

## గీ తా హృ ద య ము

బట్టినంత యనుభూతిని గ్రహించి, యద్దాని నా స్వల్ప ప్రజ్ఞాదర్పణంబునఁ నిటుఁ బ్రతిబింబింపఁజేసితి. ఇందలి దోసగులను ప్రాజ్ఞులు మన్నింతురుగాక !

ప్రథమ ముద్రణప్రతులు పఠించిన పండితమ్మన్యు లనేకులు తమ తమ యభిప్రాయములను నా కందఁజేసిరి. అందు రెండు మాత్రమిందు పొందుపరచితిని.

గ్ర ం థ క ర్త



# అభిప్రాయములు.

శ్రీమాన్ తె. కె.. గోపాలాచార్యులుగారు,

న్యాయవేదాంత విద్వాన్; కోరుకొండ.

ఒకనా డాకస్మికముగ నా సోదరులచే నీ "గీతా హృదయ" మనెడు చిన్ని పొత్తము విమర్శనకై నాకు ప్రసాదింపఁబడినది. అదియొక శుభముహూర్త మనక తప్పదు. నాటినుండియు నాకీగ్రంథము నందలి యభిమానము అసలు గీతయందు కంటె యినుమడింపఁ దొడఁగి కంఠస్థీకరణమునకుగూడఁ బ్రోత్సహించుచున్నది. అందులకుఁ గారణ మీ నిర్దుష్ట సంగ్రహీకరణ నైపుణ్యమును, మృదుమధుర పద్యరచనా వైఖరియు, సక్రమ సోపానసన్నిభ సన్నివేశమును, మానవ జీవితోన్నతి కనుగుణమగు సమన్వయ శక్తియు, నిర్దుష్ట గీతాచార్య హృదయోద్ఘాటన నైపుణియు ననుట యతిశయోక్తి గానేరదు......

అనేక వాదోపవాదములలో నొప్పెడు కొన్ని ఘట్టముల నిపుణుఁడగు ప్రాడ్వివాకునిభంగి నేరుపుతో సువేలవముగ నాంధ్రీకరించుట గ్రంథకర్త విజ్ఞానావధిని చాటుచున్నది. గ్రంథమును చదువుచుండ మాటలాడుచున్నటులే గోచరించుట గ్రంథకర్త రచనాపాటవమునకు నిదర్శనము.

## గీతాహృదయము:

నా దృష్టిలో గీతాభిమాను లెల్లరును యీ గ్రంథమును కంఠస్థ పరచి నిత్యము ననుసంధించుచుండిన గీతార్థము లన్నియుం గరతలామలకమగుటయేగాక గీతాచార్యుని ప్రేమను జూరగొనుటలో సందియ మిసుమంతయు లేదు. గీతాహృదయమును గుర్తెరుంగుటకు "గీతాహృదయ" గ్రంథమును మించిన గ్రంథాంతరము గాన్పింపమి విద్యాధికారు లీ గ్రంథము నొక పాఠ్యగ్రంథముగ నిర్ణయించి విద్యార్థులకు మహోపకారము గావింతురని వేడుచున్నాను.

తె॥ కం॥ గోపాలాచార్యులు.



బ్రహ్మశ్రీ కవిసార్వభౌమ దుర్భాకరాజశేఖర
శతావధానిగారు, ప్రొద్దుటూరు.

ఈ కవి కవిత్వ ముత్తమ శ్రేణిలోనిది. లలితము లైన శబ్దములతో ధారాళమైన ధారతో, పేశలమైన శైలితో, మెత్తని వృత్తితో, మంచి రసస్ఫురణముతో, మధురాతి మధురసమాస ధోరణితో, పుష్టములైన భావముతో, గ్రంథమంతయు జక్కని పాకమున నడచినది. ఆధునికులలో యిట్టి రసవత్కవిత్వము వ్రాయువారు కొలదిమంది మాత్రము కలరు. యతిప్రాసముల పట్టున నీకవి యిసుమంతయు గష్టించినవాడుకాడు. ఎచ్చటనే శబ్దము వాడిన నుత్తమరసము ప్రభవించునో అచ్చట నట్టి శబ్దమునే వాడినాడు.

"తేజోమయోవా"కను వాక్య మీయనయెడ నన్వర్థమగుచున్నది. ఈ గ్రంథము సర్వవిధముల గొనియాడ దగినది. ఇది కవి కృషిచేసిన ఆంధ్ర సారస్వతాంబుధినుండి వెలువడిన యమృత మహాకలశము. ఆంధ్రదేశము నందంతట వ్యాప్తికి రాదగిన గ్రంథము.

కవిసార్వభౌమ దుర్భాక రాజశేఖర శతావధాని.

# అంకితము.

శ్రీమద్భానుకులాబ్ధిసోముని కృపా
శీర్వాద సంలబ్ధ వి
ద్యా మాధుర్యసముద్భవం బయిన కా
వ్యం బాటనిద్దాని నా
రామాంఘ్రిద్వయ మందె యంకిత మొన
ర్పన్ బూనితిన్ భక్తిమై
క్షేమంబై, తిరమై, విభూతిమయమై,
చిత్తాబ్జ మేపారఁగన్.

## శ్రీ కా ర స్త వ ము

శ్రీకారమ్ము శుభప్రదమ్మనుప్రశ
స్తిన్ బుద్ధిఁబాటించి, తత్
ప్రాకారమ్మునఁ గూరుచుండి, రచనా
ప్రారంభసంరంభినై,
శ్రీకృష్ణప్రతిపాదితమ్ము, సకల
శ్రేయో నిధానమ్ము, గీ
తాకావ్యమ్మును జేతఁబట్టితి నవం
త ప్రేమభావోన్నతిన్.

## భా ర తీ స్త వ ము.

గీతాసాగరమున్ మథించి, యుభయ
క్షేమంకరంబైన వి
ఖ్యాతజ్ఞాన సుధారసమ్ముఁగొని, బ్ర
హ్మానందమున్ బొందఁగాఁ
జేతోవీథిఁ దలంచి, నిస్తులవచః
శ్రీసత్త్వసంలబ్ధికై
మాతృస్తన్యముఁ గోరివచ్చితి, సుతుం
బాలింపవే భారతీ!

## వి నా య క స్త వ ము

వ్రాసిరి పద్యముల్ పదులు
వందలు, వేలు, వినాయకస్తుతుల్
భాసురశ్రీల సత్కవులు;
భక్తినొ ? లేక భయమ్ముచేతనో ?
దాసజనాంతరంగ పరి
దానము తత్కరుణాకటాక్ష వి
న్యాసము, సర్వసంకట వి
నాశము, దానికి దోసి లొగ్గితిన్.

## కృ ష్ణ స్త వ ము

భగవద్గీతలలోని నీనుడువులన్
బాటించి సర్వస్వమున్
దెగి నీ కర్పణచేసినాడను ప్రభూ !
నీ వాడనా యెంచి ప
ల్వగలన్ ముంచక జ్ఞానభక్తికలనన్
భవ్యాత్ముఁగాఁ జేయుమో
ఖగరాడ్వాహన! దుగ్ధవార్ధిశయనా ?
కౌంతేయ సంరక్షణా !

## గీ తా హృ ద య ము

ఓ నవనీతకోమల మ
హోజ్జ్వల చారుతర స్వభావ! ఓ
గానకళాకలాప పరి
కల్పిత భక్తజన ప్రమోద! ఓ
ధ్యాన సమాధి లక్ష్య పర
మార్థసుధా నిలయుంబ! వేగ రా
వే! ననుఁగావవే! హృదయ
వీధి నొకింతుకఁ దాండ వింపవే!
సేవళమైన పూవున జ
నించిన కమ్మనితావి వోలె; స
ద్భావసహాస్రి గర్భిత సు
ధామయ కోకిల గాన మట్లు, బృం
దావన గోపికాహృదయ
దామము లందలి ప్రేమభాతి; మ
జ్జీవిత మున్నతాశయ వి
శిష్టముగా నెరవేర్పు మాధవా!
నీ రమణీయ కాంతిమయ
నిర్మల శారదచంద్రి చంద్రికా
పార ధునీ తరంగముల
సంఖిట విందుల నారగించు ప్రే

2

గీ తా హృ ద య ము

మారణనేత్ర సారసచ
యమ్మన కైహికధూళిధూసర
ద్వారవినోద శుష్కసము
దాయము మోదమొసంగ నేర్చునే!

క వి ప్ర శం స

జగదుద్ధారణమే ప్రయోజనముగా
స్వాంతమ్మునం దెంచి, లో
తు గనల్ త్రవ్వి, యనర్ఘదివ్యమణి సం
దోహమ్ము లోకమ్మునన్
దెగువం జల్లిన పూర్వసత్కవుల బు
ద్ధిప్రాభ వాంభోనిధిన్
విగతస్వార్థుఁడనై మునింగెద, రసా
విర్భూత నమ్రస్థితిన్.

పి తృ స్మ ర ణ

జంకును గొంకులేని సర
స ప్రతిభాయుత దివ్యమూర్తి, ప్రే
మాంకసమాధి నిశ్చల శ
శాంకరుచిప్రియ చారుకీర్తి, న

## గీ తా వ్యా ద య ము

ప్యంకసువర్ణపీఠి నిడి
యాశువు చెప్పిన జ్ఞానశక్తి యుతా
శంకరసుబ్బరాయ గుణ
సాగరు మత్పితృపాదుఁ గొల్చెదన్.

## ఆ చా ర ము

గీతార్థమ్మును గీతపద్యముల లో
కే మార్చు టాచారమై
ఖ్యాతిం గన్నది తెన్గునాఁట, భగవ
ద్గానామృతాస్వాదనన్
జేతమ్ముల్ ద్రవియింప, సత్త్వగుణ వం
శీనాదమాధుర్య సం
జాతానంద సమృద్ధిఁ బాడు నివిగో!
శార్దూల మత్తేభముల్.

* * *

## హృదయము

—:o:—

మానవ జీవిత మ్మనెడు
మంజులకావ్యము వ్రాయబూను నె
వ్వానికి నైన, నందుగల
వ్యాకరణాది సమస్తసంశయ
గ్లానులఁదీర్చు జీవిత ని
ఘంటువు గీత; తదర్థ వేదియౌ
వానికి జీవయాత్ర నిరు
పద్రవమై కొనసాగు నిచ్చలున్.

# గీతాహృదయము.

—:o:—

## అర్జునవిషాదయోగము.

### రంగము.

(ధర్మక్షేత్ర) మగు కురుక్షేత్రము-యుద్ధసన్నద్ధములైన కురుపాండవ
సైన్యములు-అందుఁ బాండవ సేనామధ్యమ్మున శ్వేతాశ్వ
ములు పూన్చిన రథముపై కృష్ణార్జునులు.)

అర్జు:—

బావా ! యుద్ధము సేయవచ్చిన మహీ
పాలప్రవాహమ్మునన్
నావా రెవ్వరొ ? వారివా రెవరొ ? సం
దర్శించునందాకఁ, దే
రా వైపించుక సాగ నిచ్చి రణమ
ధ్యంబందు నన్నిల్పుమీ !
భావోద్రేకము మిన్నుముట్టెను నపూ
ర్వభ్రాంతి విక్రాంతమై.

(కృష్ణుఁ డట్లు యొనర్పఁ అర్జునుండు ఉభయసైన్యము లందలి
బంధుమిత్రుల విలోకించి)

వీరిం జూచినయంత నాహృదయ మా
వేశమ్మునం దూగెఁ, జే
జారెన్ గాండివ, మంగముల్ వడకె, బా
ష్పశ్రేణి వర్షించెడిన్.

గీతా హృదయము

నోరెండెన్, బులకల్ జనించెఁ; బసికం
దున్ నన్ గటాక్షించి, యీ
పారావారము నుత్తరించు సులభో
పాయంబు బోధింపవే!
నరమాత్రుండను, సంశయాత్ముఁడను, జిం
తాక్రాంతచిత్తుండ; నీ
ధరణీనాథ చమూసమూహముల మ
ద్బాణాగ్ని నింకించి, మా
కురువంశక్షయకారణవ్యథకు సం
క్షోభించి, తత్పాపమున్
భరియింపం దరమా! రమారమణ! సం
పద్వైభవాకాంక్షినై.
ఆప్తప్రాణహరైక సాధ్యమగు రా
జ్యప్రాభవం బేల? ని
ర్లిప్తస్వాంతుఁడనై యరణ్యమున వ
ర్తింపంగరాదో? సదా
తృప్తింగాంచుచు మాధవా! హృదయ సం
దిగ్ధస్థితిన్ బాపి సం
తప్తాత్మన్ నను నేలుకొమ్మిక విషా
దధ్వాంత విధ్వంసివై.

దుష్టసుయోధనుండు పలు
దండగముల్ పచరించి ధర్మమున్
నష్ట మొనర్చి మా స్మృతుల
నాశము చేయఁగడంగెఁ గాక; నే
శిష్టుఁడ నయ్యు బంధు హిత
శిష్య గురుత్రయ మెట్లుసేతు; నీ
క్లిష్టసమస్య నా హృదయ
కీలకమున్ గదలించె నచ్యుతా!
పాపాత్ములఁ బరిమార్చినఁ
బాపంబే కలుగుఁ గానఁ బావనచరితా!
ఆపని నాపని కాదికఁ
గోపింపకు మయ్య! కుసుమ కోమలభావా!

(అని విల్లమ్ములు పారవైచి కర్తవ్యతామూఢుండై విషాదాంత
రంగుడై ఉదాసీనమతిఁ దేరుపైఁ గూరుచుండె.)

* * *

## సాంఖ్య యోగము

కృష్ణు—పార్థా!

వీరక్షత్రియవంశ సంభవుఁడ వీ
వే దుర్బలాత్ముఁడవై
పారంజూచిన, క్షాత్రధర్మమిఁకే ని
ల్వ న్నేర్చునే భూమిపై ?
కౌరవ్యుల్ నినుఁజూచి నవ్వరొకో? స్వ
ర్గద్వారమౌ నాహవ
ప్రారంభమ్మున దీర్ఘసూత్రముల న
ల్లంజెల్లునే? ఫల్గునా!
ఈ దేహమ్ములు నశ్వరమ్ములుకదా!
యింద్రాత్మజా! వీనికై
ఖేదం బందెద వేల? జీవితకురు
క్షేత్రమ్మునన్ స్వీయమ
ర్యాద న్నిల్పుము! ఆత్మనిత్య మను వే
దార్థమ్ముఁ బాటింపుమా!
ఈ దౌర్భాగ్యవిషాదనాదయుత సా
హిత్యంబు నీ కేటికిన్?
గిట్టుటకే పుట్టిన యీ
కట్టెల నెటు జంపుదంచు, గాసిలె దేలా?
పుట్టిన పుట్టువు కెనయగు
దిట్టదనముఁబూని ఋణము దీర్పుము వత్సా!

పూరుషుఁడు జీర్ణ వస్త్రమ్ముఁ బారవైచి
క్రొత్త పుట్టంబు మైఁదాల్చి కులుకు పోల్కి
వేషములు మార్చుచుండు నవీన ఫణితి
నంతియేకాని చావు లే దాత్మ కెపుడు.

"నా" "నీ" భేదములన్ రచించుకొని దీ
నత్వమ్మునన్ శుష్కవి
జ్ఞానాభాసము నెల్లఁ బోసెదవు శి
ష్యా! చావులుం బుట్టువుల్
జ్ఞానిన్ సుంత కలంపనేరవు సుమా!
సత్యంబు యోజించినన్
"నా" "నీ" భేదములేక యాత్మ జగ మం
తా తానయై వెల్గెడున్.
ఈ తత్త్వమ్మును గుర్తెఱింగిన ఘనుం
డేచింతయున్ లేక ద్వం
ద్వాతీతమ్మగు బుద్ధి నిశ్చలత నా
త్మానందమున్ బొందుచున్
శ్వేతస్వచ్ఛ మనోజ్ఞసుందర కళా
వేదిన్ సుఖాసీనుఁడై
నాతో నైక్యముఁబొందెడున్ విషయస
న్యాసమ్ము కట్నమ్ముగా.

అదిగో! ప్రాచ్యమహీధరాగ్రమున భూ
మ్యాకాశపర్యంత కాం
తిదమౌ భాస్కరమండలంబు ముదిమిన్
దేజంబు సుప్తైనఁ ద
గ్ధముగా! యెన్నియుగాలు సర్వజన సా
క్ష్య ప్రాప్తమై నిల్చినన్
సదసద్వస్తు వివేచనా నిపుణులన్
గాలంబు బంధించునే!

*　　　*

# క ర్మ యో గ ము

## క ర్మ

జననంబందిన సర్వజీవులు మదా
జ్ఞా బద్ధులై నిత్యముల్
బనులం జేయక తప్ప దన్నప్రకృతి
ప్రాబల్యముం బట్టినా
"కనులం గారముఁ గొట్టలే" రెవరు శి
ష్టుల్ స్వామీ సోమరుల్
పనులం జేయు విధానముం దెలిపెదన్
భావించి పాలించుమా!
నరకం బంచును స్వర్గ మంచును నుప
న్యాసంబు సాగించి సో
మరివై పామరునట్లు నీవిపుడు క
ర్మత్యాగముం జేయఁగా
సరియౌనే? నిను నమ్మి వచ్చిన మహా
సైన్యంబు నీ వెంటనే
పరుగు ల్వెట్టదె? యింతకన్న నరక
ద్వారంబు వేరున్న దే?
ధరలోఁ బండితు లాచరించు నదియే
ధర్మంబుగా నెంచి పా
మరులుం జేయుట సుప్రసిద్ధముకదా!
పార్థా! యనర్థమ్ము సు

స్థిరబుద్ధిం దలపోసి యాత్మ గుణ ని
క్షేపమ్ము గాలించి, క
ర్మరహస్యమ్మును జిక్కఁబట్టుకొని, క
ర్తవ్యమ్ముం బాలింపుమా!

'జనకాదుల్ కృతసిద్ధులయ్యును నిరా
శా భాస మానాత్ములై
యొనరం జేయరె! లోకసంగ్రహణ వి
ధ్యుక్తమ్ములౌ కర్మముల్
పొనరింతుఁ బహుకర్మ లేనును స్వయం
భూతుండనై యుండియుఁ
వినుమీ యోగ మమోఘశక్తియుత ము
ర్విన్ ముక్తి సాధింపగన్.

ఫలముల్ గోరక నిత్యకర్మరతుఁడై
వాంఛల్ విసర్జించి ని
శ్చల చిత్తమ్మున భక్తి పీఠ మిడి, వి
శ్వాసమ్ము చేయూతగా
దళితాబ్జాత దళోపవిష్ట సలిల
త్యాగోపమానమ్ముగా
నిల వర్తించెడి కర్మయోగికి సుఖం
బే నిత్తు నీ యా యెడన్.

## స్వధర్మము

చాతుర్వర్ణములన్ సృజించితి, గుణ
స్వాతంత్ర్యమున్ బట్టి, వా
రేతద్ధర్మ నియుక్తకర్మములఁ, గో
ర్కేల్ వాసి, శ్రద్ధాళులై,
భూతప్రీతికరమ్ముగా నొనరుపన్
బుత్తెంచి యున్నాఁడ; నీ
వాతత్త్వార్థ మెఱింగి కర్మఫలమున్
ద్యాగమ్ముఁ గావింపుమా!
ఎవ రేవృత్తిఁ జరింప నర్హతములో
యెవ్వారి కవ్వారె బు
ద్ధ్యవకాశమ్ములఁ జూచి యెన్నుకొని, త
త్తద్ధర్మకర్మమ్ములన్
సవనప్రాయముగా నొనర్పవలె; నీ
చం బాత్మధర్మం బటం
చవనిం జుల్కనఁజూడరాదు పరధ
ర్మాపేక్ష, నో భారతా!
ఆదర్శమ్ములఁ గొన్ని దృష్టిపథమం
దశ్రాంతము న్నిల్పి, మ
ర్యాదామోదవిరోధబాధలను ని
ర్లక్ష్యమ్ము గావించి యా

3

గీ తా హ్వా ద య ము

హ్లాదస్వాంతముతోడ నిత్యవిధు లె
ల్లం జేయుచున్, భౌతికో
న్మాదం బంటియు నంటకుండు నతఁడే
మాన్యుండు ధాత్రీస్థలిన్..

.

## య జ్ఞ ము

పరసేవానియమాగ్ని హోత్రమున స
ర్వత్యాగముం జేయుటే
వరయజ్ఞం బని యెంచు, మందలి హవి
ర్భాగమ్ము చేఁ దృప్తులై
సురభావమ్ములు దైత్యభావముల సం
క్షోభంబు మాయించి, సు
స్థిర శాంతి న్నెలకొల్పు మానసమునం
జేగంట మ్రోగించుచున్.

.

దైత్యభావమ్ములను వీడి తనరుకన్న
మోక్షమన వేర యున్నదే పుడమిలోన?
నాత్మగృహమునఁదూగుటుయ్యాలలోన
బిడ్డ నిడుకొని యూరెల్ల వెదక నేల?

# కర్మ యోగము

## దానము

అన్యాయార్జితవిత్తముం దొకసహ
స్రాంశంబు నే సంస్థకో
మాన్యం బిచ్చి కితాబులన్ బడయు డం
బాచారమే దానమై
మాన్యత్వమ్మును గాంచుచుండు; భవసా
మ్రాజ్యమ్ము సర్వస్వమున్
దాన్యత్వస్థిరబుద్ధి నిచ్చుటె వదా
న్యత్వంబు కుంతీసుతా!

## తపము

కృపతో నిన్ను సృజించి, పోషణకునై
వృత్తుల్ విచారించి, తో
రపువాత్సల్యముతో నిజాంగణముఁ జే
రన్ దారులం దీయు, ని
త్యపదార్థ ప్రణయార్తిసంజనిత సం
తాపంబె; యుత్కృష్టమౌ
తపమంచుం దలపోసి, తద్ద్వితపర
త్వస్థైర్యమున్ బూనుమా!

గీ తా స్వా ద య ము

జపములు, దేవపూజలు,
తపములు, జడదాల్చి వేషధారణ లేలా?
కృపమాలి దీనజనులను
దపదప నుడికించు నసుర తాపసుల కిలన్.

డాం బి కా చా ర ము

ఆచారమ్ములుఁ బూజలున్ గలిసవా
నాహారపు నేమముల్,
వాచాలత్వపరంప రాతిశయనా
వాదాతివాదమ్ములున్
"దూ" "చా" తప్పక నర్థహీనసరణిం
దూఁగాడు శాస్త్రమ్ము లే
లా! చాలున్! గరుణావిహీనుఁడగు వా
లాయంపుఁ గర్మిష్ఠికిన్.
నామా ల్వెట్టిన, బూది వెట్టిన, సదా
నారాయణా! శ్రీహరీ!
రామా! కృష్ణ! యటంచు మొత్తుకొనినన్
రాద్ధాంతసిద్ధాంతముల్
ప్రామాణ్యప్రతిభేదముల్ పవలు రేల్
వాదించి శోధించినన్
ప్రేమజ్యోతి వెలుంగనట్టి మనుజ
ప్రేతమ్ము శోభిల్లునే!

మేఘోబంధుర జీవితప్రియమే
మేలంచు భావించి, హృ
న్మాధుర్యమ్ము తిరస్కరించి, భవకా
మ్యస్యంద నాహూతులై
ఆధివ్యాధి మహాంధకారమున, హిం
సారణ్య మధ్యమ్మునన్
సాధుత్వమ్మును సంహరించు మృగయా
సంరంభముల్ సెల్లునే!
శారుంబూరు మటంచుఁ జౌకదరగ
ప్పాల్గొట్టు పొత్తమ్ములన్
బారుందప్పక వల్లెవేసికొని స
ర్వజ్ఞానసారాంశముల్
జూరంగొన్న విధాన శిష్యతతికిన్
బోధ్యమ్ములన్ జెప్పు ని
స్సారు ల్వంచకు, లట్టివారిదెస ని
ష్కారుణ్యమే పుణ్యమా!

## శ్రీ తత్త్వోదయము

### ఆత్మ సంయమము - సాధన

మనమున చేలఁగట్టఁబడి
మంజులమై ఖచిఁ గ్రాలుచున్నదా
కనకపు దాళపుం జెవి య
కల్మషమోగ నిమూఢచిత్తులా
మును లది యందిపుచ్చుకొని
ముచ్చట దీరఁగ మోక్షమందిర
మ్మున కధికారులై తదను
భూతినిఁ బొందుదు రెల్ల వేళలన్.

ఆత్మవశమై ప్రవర్తించు నట్టి మనసు
స్నేహితుని భంగి లక్ష్యసంసిద్ధిఁ జేర్చు
నింద్రియమ్ముల పాటకు నృత్యమాడు
చిత్త ముభయభ్రష్టత్వ దుస్థితికిఁ దార్చు.

కరతలామలకమ్ముగఁ గానవచ్చి
చేరవచ్చిన మఱికొంత దూర మేగి
పట్ట నుంకింపఁ జెయిజాఱి పరిహసించు
కోరికలకన్నఁ బ్రతిపక్ష కోటి కలదె?

మానస మొక్క కోతి యను
మాట తిరమ్ముగ నమ్మి మత్పద
ధ్యానసమాధి నిష్ఠులగు
దాంతులు స్సైత మొక్కొక వేళలన్

## ఆత్మ సంయమ యోగము

మానస మాపలేక యెవ
మానము పొందుచు నుందురి, భక్తిసం
ధాన మొనర్చి యత్నిచేసు
దానల నీమన సూగ నీకుమా!
జ్ఞాన మొసంగు భక్తి యరి
షడ్విజయమ్మిడు జ్ఞానశక్తి ధ్యాం
ధ్యానల మారిపోవఁ దిర
మై నిరుపద్రవమై ప్రశాంతమై
మానసదుగ్ధవార్ధి పర
మాత్మ వసించుట కర్హ మయ్యెడిన్
మానస సంయమం బొకటి
మాత్రమె చాలును మోక్షసిద్ధికిన్.

నిస్తరంగాబ్ధి యట్లు సంవియము లుడిగి
శాంత గంభీరమై యొప్పు సంయ మీంద్రు
ధీరచిత్తమ్ము మమతా విదూర మగుచు
శ్రిత జనోద్ధార! ద్రౌపదీ చిత్తచోర!

శీతోష్ణమ్ముల నొక్క రీతి సముఁడై
చిత్తమ్ముఁ బంచేంద్రియ
వ్రాతమ్ము న్నియమించి నిశ్చలమనః
ప్రాసాద మధ్యమ్మునన్

గీ తా హృ ద య ము

నా శైలాగ్ర నివాతదీపకలికా
న్యాయమ్మున న్వేల్గు వి
జ్ఞాతుం డాత్మవిభూతి సంభవ
యదృచ్ఛాలాభ సంతుష్టుఁడై.

సా ధ న

బ్రహ్మచర్య వ్రతావలంబనము మూవె
సాధకున కాత్మ సాఫల్యసాధనంబు
సాత్త్వికాహార సత్సంగ సచ్ఛ్రుతాది
నియమములు చిత్తచాంచల్య భయము నుడుపు.

ఏకాంతస్థల మాశ్రయించి, శుచినై
యెవ్వాడు భ్రూమధ్య మం
దేకాగ్రమ్ముగఁ జూపుల న్నిలిపి సం
దేహమ్ములన్ బాసి న
న్నేకాంతమ్ముగ భక్తిభావమున ధ్యా
నించున్ బవిత్రాత్ముఁడై
నా కాతండె హితుండు, వానిదె మహా
నందంబు భక్తాగ్రణీ!

మనసే చుట్టము, బుద్ధియే సచివుఁ, డా
త్మజ్ఞానమే యొజ్జయున్,
విసయుంబే చెలి, యార్జవంబు దయయున్
విద్యావివేకంబులున్

## ఆత్మ సంయమ యోగము

బనిపాట ల్సవరించు భృత్యతతి బు
భ్రిజ్యోతిఁ జేదాల్చి జీ
వనయానమ్మున వెంటవత్తురు సద
భ్యాసమ్ముచే దాసులై.
మాయా బంధనిబద్ధులై ప్రబల కా
మక్రోధలోభాది ని
శ్రేయోమార్గములం జరించి భవవా
ర్ధి౯ గ్రుంకుచు౯ సుస్థిర
ధ్యేయమ్ము౯ గనలేరు మానవులు; భక్తి
జ్ఞాన వైరాగ్యముల్
పాయల్దీయ, దరింపుమీ విషయ లి
ప్తంబైన సంసారము౯.

అర్జు :

సగము సాధించి ప్రబల వాంఛాపిశాచ
దంష్ట్రిలం జిక్కి లుప్త కర్తవ్యుఁడైన
యోగ భ్రష్టుని పాలిత్రోద్యోగమునకు
ఫలము సున్నైన, గలదేమొ? తెలుపుమయ్యా.

కృష్ణు :

యోగాభ్యాస మొనర్చు సాధకుఁడు దు
ర్యోగమ్ముచే భ్రష్టుఁడై

# గీ తా హృ ద య ము

సేగిం జెందినఁ జెందుఁగాక, నఘముల్
క్షీణింపఁగాఁ బూర్వ స
ద్యోగప్రాప్త శరీరుఁడై జననముం
దున్ లక్ష్యసంసిద్ధికిన్
డీగ ల్సాచిన యోగిపుంగవుల ని
ర్నిదాత్మ గేహమ్ములన్.
అతఁ డాకృతి జనించి తొల్లిటి పుర
భ్యాసమ్ముల స్సాని సం
చిత పుణ్యమ్మున జ్ఞానభాస్కర గభ
స్తిన్ మార్గదర్శంబుగా
స్మృతి విధి న్నెలకొల్పి యోగనియతిన్
రేకెత్తు చిత్తమ్ముతో
గత మార్గశ్రముఁడై ననుంగలియు ని
ష్కామక్రియాధోరణిన్.

*

# భక్తియోగము

ధనధాన్యాది సమస్తవస్తుతతిపై,
దారాసుతశ్రేణిపై
మనుజానీకము పారఁబోసికొను ప్రే
మక్షీర ధారానిధుల్
వినయస్ఫూర్తి మదంఘ్రియుగ్మమున నై
వేద్యంబుఁ గావించుచో
వినుమీ! నిశ్చలభక్తియోగ, మదియే
ప్రేమార్థికిన్ లక్ష్యమా!

ధనమదాంధుల యధికార దర్పమతుల
మేధ కందని మోక్షధాత్రీ ధరాగ్రి
మతుల దారిద్ర్య దైన్యశుష్కాంగు లైన
యార్తనరులకు సులభసాధ్యమ్ము సుమ్ము.

నవవిధ భక్తిమార్గముల
నన్ను భజించు చనన్యభావనా
శ్రవణకఠోర దీక్ష భవ.
సంగవివర్జితులై చరించు మత్
ప్రవిమల భక్తసంతతికిఁ
వాయని చుట్టమనై యొసంగుదున్
జివుకని చీకుచింతలకుఁ
జీకని చకని శాశ్వతార్థమున్.

# గీతా హృదయము

చిత్తాబ్జమ్మున నాదు చిత్రపటముం
జిత్రించి, మచ్చింతనా
మత్తుండై మదమేయ దివ్యచరితా
మాధుర్యముం గోలుచున్
రిత్తవ్యాపృతులన్ మునుంగక సదో
ద్రేకమ్ము రెట్టింప నన్
బత్తిం గొల్చు సునిశ్చయున్ గవుగిటన్
బంధించి లాలించెదన్.

*

## త్రిగుణములు : దైవాసుర ప్రవృత్తులు

త్రిగుణముల ప్రోవుసుమ్ము కుంతీకుమార !
మానవుని జీవితమ్ము; నా మాట నమ్ము;
వీని దాటినఁగాని బ్రహ్మానుభూతి
కలుగ దేరికి; నిదియ నిక్కమ్ము! సూమ్మ !

త్రిగుణమ్ముల్ త్రిపథప్రయాణగతులం
బేర్చేవు, సుదూర్ధ్వమై
నిగుడున్ సత్త్వగుణమ్ము; కర్మమున బం
ధించున్ రజోవృత్తి, తి
న్నగఁ బాతాళముఁజేర్చుఁ దామసము; గా
న న్నీవు సత్త్వార్థివై
పగలున్ రేయిఁ బ్రయత్నమున్ సలుపుమా
పై మెట్టు నీకందెడున్.

ద్వివిధంబై తనరారు మానసప్రవృ
త్తిశ్రేణి దైవాసుర
ప్రవిభేదమ్ముల; నందు సాత్త్వికగుణ
ప్రాధాన్యమా దేవతా
రవ మాలించు నొకండు, తామసగుణా
రావమ్ముచే ముగ్ధుఁడై
భువిలో రాక్షసుఁడౌ నొకండు; గుణాసం
భూతాకృతుల్ మానవుల్.

## గీ తా హృ ద య ము

అసమాన దుర్జనత్వ కలు
షాంబుధి లోపల నోల లాడుచున్
విసము వెలార్చుసర్పములు,
వృశ్చికముల్ తమసాటిగాఁగ దు
ర్వ్యసన మహాంధకార మొక
రమ్యతరమ్మగు స్వర్గమంచు సం
తసమునఁ దేలు మూఢజన
తామసులే నరలోక రాక్షసుల్.

ధనకనక వస్త్రవాహ నాద్యఖిలవస్తు
సారసంగీత ముగ్ధరాక్షస ప్రకృతుల
కనుప మానంద సత్యసుధాబ్ధిఁ దేల్చు
మోక్ష సంగీత మెబ్భంగి ముదముఁ గూర్చు?

సోదరు డంచు నీవిటులఁ
జొక్కఁదగాని, సుయోధనుండు దై
త్యాధముఁ, డాతని న్విజయ
ధామముఁ జేర్పఁదలంచు రాజు లా
మోదకులాటఁ దామసులె,
ముమ్మరమై చెలరేగు నాసుర
వాదము మాన్పఁగా వలదె?
వాసవపుత్ర! కుతర్క మేటికిన్?

# జ్ఞా న యో గ ము

నానారూపకలాపజాలముల భి
న్నత్వమ్మునం దోఁచు ని
త్యానందుండను నిర్వికల్పుఁడ ననం
తజ్ఞాన భాస్వంతుఁడన్
నేనే సుమ్మీ; నియంతనై త్రిభువనా
నీకంబు శాసించుచున్
నా నైజమ్మిది, లెస్సగాఁ దెలియుమ
న్నా! నీకు మేలయ్యెడున్.

ఈ విజ్ఞానమె బ్రహ్మవిద్య యను సా
హిత్యంబు; జిజ్ఞాసచే
జీవుల్ దీనినిఁ బొందవచ్చుఁ బ్రతిభా
స్నిగ్ధాంత రంగమ్ములన్
గావు ల్వెట్టి ఫలించునంత దనుకన్
గాఢవ్రతస్వీకృతిన్
జావుం బుట్టువు లేదు తత్సఫలతన్
సాధించు విజ్ఞానికిన్.

నాసంకల్ప విధేయమై ప్రకృతి నా
నావస్తు విన్యస్తమై
నీ సంసారము మాయచేఁ బొదుగుచున్
సృష్ట్యంత మందేకమై

నానారంబులఁ, బూను సాక్ష్యుఁడ సదా
నందుఁడ నిత్యుఁడ నే
నే సుమ్మోయి ధనంజయా! హృదయ సం
దిగ్గస్థితి నీవెఱుంగుమా!

పక్వఫలము వృక్షమునుండి పడినభంగి
జ్ఞాని కడదేరు కర్మ శేషమ్ముఁగడచి
సంచితానికి వహ్నిని బెంచుకొంచుఁ
బాపి వర్ధిల్లు దినదినప్రాభవముగ.

నాతత్త్వాంబుధి నోల లాడుచు మహా
నందమ్మునందేలు వి
జ్ఞాతల్ సంసృతిమాయ నంటరుసుమా!
సన్న్యాసదీక్షాపరుల్
వీతక్రోధులు, చిత్తసంయమకళా
వేత్తల్, గుణాతీతు, ల
ద్వైతుల్, వారికి నాకు భేద మిసు మం
తఁ లేదు సుమ్మర్జునా!

పరూపమ్మును బుద్ధిలో నిలిపి న
న్నే కాఁగ్రి చిత్తమ్ముతో
నారాధింతు రె మదీయ భక్తతతి నే
నారూపమ్ముం బొంది త

ద్వారంబుల్ భుజపీఠిదాల్చు నిది నా
వంశక్రమం బంచు నె
వ్వారుం జెప్పఁగలేరు; రూపరహిత
వ్యాపారుఁడన్ నమ్ముమీ.

మతముల్ దృష్టులుసూపు మార్గములు సు
మ్మా! వానిలో నొక్కటిన్
మతిసంధించి సునిశ్చయాత్మకుఁడవై
మాయా మృగాకాంతిత సం
సృతి దుఃఖాటవి దాటుమా! పరమత
స్నేహంబు పాటింపుమా!
గతి నేనేయని బుద్ధి నిశ్చలుఁడవై
కైవల్యమున్ బొందుమా!

అన్యమతస్థులంచుఁ బరి
హాసము సేయక భ్రాతృభావ సౌ
జన్యసుధామరీచికలు
సాఁచి కవుంగిటఁ జుచ్చి యెత్తు కా
రుణ్యమె భిన్న భిన్న నర
లోక సమైక్యోదయ కారణంబు; తత్
పుణ్యమె వ్యక్తిజీవన త
పోవనకల్పక మార్యపద్ధతిన్.

# గీ తా హృ ద య ము

ఏ యే వేళల, నే ప్రదేశముల, నే
యే హాపక్షేపమ్ములన్
నా యిచ్ఛాశక్తి కలాపమందునఁ బ్రమా
ణంబైన ధర్మంబు సు
స్థాయిన్ బాసి నశించు, నట్టితఱి, నే
తద్ధర్మసంరక్షకై
ఆ యా వేళల, నా ప్రదేశముల, నా
యాయా రూపముల్ దాల్చెదన్.

ఆ ధర్మచ్యుతి కారణంబయిన దై
త్యశ్రేణి మర్దించి, తత్
బాధాకుంఠిత భక్తలోకమును సం
బాళించి, వెన్వెంటనే
నాధామంబును జేరుకొందు; నిదియే
నా ధర్మ, మీ వట్టులే
నీ ధర్మంబును గుర్తెఱింగి యసురా
నీకంబు నిర్జించుమా.

సాదృశ్యమ్ములు లేని గుహ్యతర వి
జ్ఞానంబు సర్వస్వమున్
స్వాదూక్తి స్వరరాగ యుక్తముగ నీ
స్వాంతమ్ము నందుంచితిన్

జేదంచు న్నొడవాడి దుస్తర మహా
చింతాబ్ధిలో మున్గెదో?
కాదంచుఁ గ్రహించి సత్వర జగ
త్కళ్యాణముఁ గూర్చెదో?

*   *   *

## విశ్వరూప సందర్శనము - సంశయ విచ్ఛేదము
## ఆ త్మా ర్ప ణ

అర్జునుఁడు;

నీ వొసంగిన జ్ఞానసందేశ సుధలు
వీనులకు విందుసేసె మహానుభావ!
చూపఁగదవయ్య త్వద్దివ్యరూప మిపుడు
చక్షురింద్రియ మానంద సరసిఁదేల.

కృష్ణుఁడు :

అకలంకమ్మును శక్తిమంతమును ని
త్యానంద సందోహముఁ
సకలాతీతము సర్వవస్తు గతమున్
సత్య ప్రభాధామముఁ
మకుటాగ్రోన్నత మార్యసన్నుత మసం
భావ్యమ్ము దివ్యమ్ము మా
మకరూపంబిదె! చూడు మర్జున! మనో
మాలిన్యముల్ వాయఁగఁ

భాస లెన్నఁగ లేని, మానసములుఁ
భావింపగాలేని, నా
నాసౌభాగ్యము జుర్రిలేని, నయనా
బ్జమ్ముల్ శ్రీవస్సుఁపదల్

వాసింజూడ వినంగ లేని, తనువుల్
స్పర్శింపఁ గాలేని, నా
వేసంబుల్ కనుగొమ్ము దివ్యమగు దృ
గ్వీచిన్ బ్రసాదించితిన్

అర్జునుఁడు :

ఎవ్వఁడవీవు? నివ్విధిఁ జ
రింపఁగ నేల? సమస్త భూతముల్
రివ్వున వచ్చి త్వన్ముఖద
రీ నిలయమ్ములఁ జొచ్చు టేమి? యీ
స్నవ్విధి నుండి యీ క్షణము
నంద యజాండము నిండి తెట్లు? నా
కివ్విధ మెల్లఁ దెల్లముగ
నేర్పడఁ జెప్పుము నీవు మ్రొక్కెదన్.

కృష్ణుఁడు :

కాలపురుషుఁడ, వీరి ప్రాణాల నెల్ల
మున్నె హరియించినాఁడ ప్రచ్ఛన్నవృత్తి
నామమాత్రమ్ముగా యుద్ధభూమిలోన
వీరిఁ జంపుము నిష్ఫలాపేక్షమతిని.

మాటలు వేయునేల విను
 మా! సకలార్థములన్ త్యజించి, మో
హాటము డించి, లోనియుహా
 ము న్విడనాడి, యనన్యభక్తి చై
సూటిగ వచ్చి నాశరణుఁ
 జొమ్ము పార్థ! త్వదీయపాప ఘో
రాటవి దాటఁ జేసెద; ని
 రామయమైన పదమ్ముఁ జేర్చెదన్

దండకము

అష్టుపు :

శ్రీసుస్మితాననా! పాథోధిగంభీర! దేవాతిదేవా! పవిత్ర ప్రభావా! మహావిశ్వరూపా! లసత్ జ్ఞానదీపా! జగత్సృష్టిసంహార లీలావినోదా! విషాదాంత రంగుండవై యాత్మకర్తవ్యమున్మాని శూన్యం బుపాసించుచున్ సైన్యమధ్యమ్మునన్ గర్మరంగమ్మునన్ దేరుపైఁ గూరుచున్నట్టి నన్నుం గటాక్షించి గీతాసుధావృష్టిచే నాత్మతాపమ్ము జల్లార్చి కర్మంబు బోధించి జ్ఞానంబు సంధించి భక్తి న్నిరూపించి వేదాంత సూక్ష్మమ్ములన్ గానపీయూష గర్భమ్ములన్ డాచి నావీనులంబోసి ధర్మచ్యుతి స్థానమైనట్టి నాబుద్ధి జాడ్యమ్ము నిర్మూలముం జేసి యజ్ఞాన గాఢాంధకార ప్రదీపమ్ము నీ దివ్యరూపమ్ము కారుణ్యమేపారగా నేత్రపర్వమ్ముగా నాత్మ మోదముగాఁ జూపి

నా వోమహాత్మా! జగన్నాథ! విజ్ఞానసింధూ! భవద్దివ్య లీలాకలాపమ్ము నూహింప వర్ణింపఁ జిత్రింపనాబోంట్లకున్ శక్యమే భక్తిభావాంకితంబైన చిత్తమ్ముతో నాదు సర్వస్వము నీదు పాదాంబూజాతంబు లందుంచి నీయాజ్ఞకున్వేచియున్నాను నన్నున్ సుధాదృష్టి వీక్షించి సారథ్యము జేయు మన్నా! నిను న్నమ్మి తన్నా! జితాత్మప్రసన్నా! నమస్తే! నమస్తే నమస్తే నమః.

అర్జునుఁడు :

ధన్యుఁడనైతి, నన్యులకు
దానతపోనియమాది కర్మలన్
సన్యసనమ్మునన్ బడయఁ
జాలని నీ శుభదర్శనమ్ము నా
పుణ్యవశమ్మునన్ దొరకెఁ
బూతచరిత్ర! విషాదభీకరా
రణ్యము నుత్తరించితిఁ; ది
రమ్మగుబుద్ధి రణమ్మొనర్చెదన్.
నావా రంచును వారివా రనుచు భి
న్నత్వంబు కల్పించి, మి
థ్యావాదాంశుక మాత్మధర్మము పయిన్
దట్టమ్ముగాఁ గప్పి మో

హావేశమ్మునఁ గన్నుఁగాన కటు లా
యాసవ్యథం జెందు నా
భావమ్ముల్ సరిదిద్దినాడ వనుకం
పాయత్తచిత్తుండవై.

తాతల్, తండ్రులు, సోదరుల్, విషయపా
తాళమ్ముఁ జూపింపఁగా
గోతుల్ త్రవ్వెడువారెకాని హృదయ
క్షోభాగ్నిఁ జల్లార్తురే?
నీతు ల్సెప్పిన, దారిఁజూపిన, హిమా
సేతుల్యవశా మోక్షముం
జేత న్నెట్టిన, నీవకావె! మనసా
చింతింతు నిన్నెప్పుడున్.

వారు స్వైరుసు శూరుఁ క్షేత్రఁడని సం
భావింప గర్వోద్ధతిన్
వీరాలాపము లాడుచుందుదు; భవ
ద్విశ్వస్వరూపమ్మునం
దూరుం బేరును లేని జీవతతులం
దోకట్టండనం చిక్కు క
ల్గారంజూచి యహమ్ము వీడితి మహా
త్మా! భక్తకల్పద్రుమా!

చక్రంబూని విహారవేళల నయ
స్యా! యాదవా! యంచు మం
తనము ల్సేసితి నింతకాలము మహా
త్మా! దేవదేవుండ వం
చనుమాత్రమ్ము నెఱుంగనైతి ఘన మా
యా చోదితాత్ముండనై,
నను మన్నించి మదాత్మకల్మష మహా
నైవేద్యముఁ బొందవే!

ఘోరంబై, దురితాంధకారమయమై,
కోటానుకోటి ప్రజా
భారంబై, బహుళవ్యథాభరితమై
వారింపఁగా రాని హిం
సారావంబులతోడ నిండిన ధరా
చక్రంబు నే డీగతిన్
బోరం జూర్ణముచేయఁగాఁ దలచితో?
పూర్ణాహుతిన్ గైకొనన్.

స్వార్థజీమూత వృష్టిచే జననమంది,
పాపికొండపై వర్ధిల్లి, పరమశాంతి
కల్పకముఁగూల్చి, హింసాబ్ధిఁ గలియఁబోవు
కాలవాహిని నెవ రడ్డఁగలరు? చెపుము!

గీతాధ్యాయము

దేవా! నీయనసమానశక్తిమయ సం
దీప్తాకృతింజూచి, మ
చ్ఛావమ్ముల్ పులకించె నద్భుత భయ
భ్రాంతమ్ములై నేడు, త్వత్
సేవానమ్రుఁడ భక్తుఁడన్, విబుధసం
సేవ్యమ్ము సవిశ్వరూ
పావేశమ్ముపసంహరించి నిజసౌ
మ్యాకారముం జూపవే !

సంజయుఁడు :

ఈరీతిం గను జాలిమాలి నరుఁడెం
తే నమ్రభావమ్మునన్
గోరన్, జక్రగదాకిరీటయుతమా
గోపాలరూపమ్ముతోఁ
జేర న్వచ్చిన, శాంతచిత్తుఁ డగుచున్
జేజేలనర్పించి, దు
ర్వారక్షత్రియధర్మ నిర్వహణ కా
ర్యారంభసంరంభియై
విల్లమ్ముల్ ధరియించి, యాత్మ, విజయా
వేగమ్ము మిన్నంటఁగాఁ
గల్లోలమ్ముగు కర్మరంగమున ని
ష్కామక్రియాదీక్ష సం

ఢిల్లన్ దూఁకె ధనంజయుండు, హరిభ
క్తిన్ బుష్పహారమ్ముగా
యుల్లంబందునఁదాల్చి, సత్త్వగుణ వి
ద్యుత్కాంతివిస్ఫారుఁడై.

పరమాత్ముండగు మాధవుండును, ధను
ర్బాణాభిషిక్తుండు సం
గరకేళీ నిపుణుండు పార్థుఁడును యో
గవార్ధి నెచ్చోట నుం
దురో యచ్చోట, ధృతి విభూతి జయ సం
దోహమ్ములున్ నీతియున్
దిరమై కన్నుల పండువై వెలిగెడున్
దేదీప్యమానమ్ముగన్.

* * *

## జీవయాత్రి

(మాండురాగము — జంపెతాళము)

ప: పాలమున్నీటిపై బంగారుపడవలో
పయనమైనా నోయి దేవా
అ. ప. నీలిమబ్బులలోని నిండుజాబిల్లి ము
త్యాలమెఱుగుఁ జేర్చుతావా. ।పా।

1. గాఢాంధకారమ్ము క్రమ్ముకొని వచ్చేను
కన్ను మిన్నెఱుగనో దేవా
ప్రౌఢ విద్యాదీప్తి భాగ్యమాంబైన
రూఢిమార్గము చూపుతావా. ।పా।

2. ఈ కోర్కె-కెరటాలు నిండి ప్రియానిలముచే
ఈ నావముంచేను దేవా
ప్రకటమ్మగు భక్తి భావమను తెప్పపై
భవవార్ధి దాంటిచుతావా. ।పా।

3. సుమగంధయుత కళా సుప్రవాసిలఁ బిప్రుడు
శుభశకునమై వీచె దేవా
కమనీయమగు నీదు కరుణామరీచి నా
కనుల పండువు చేసెదేవా. ।పా।

*